# గాలి, గ్రహాలు



☆

వసంతరావు వేంకటరావు

# ముందు మాట



"విజ్ఞానం పద్యాలలోనా ?" అను ప్రశ్నకు తావులేక పోలేదు. కాని, పద్యం సులభంగా కంఠస్థమౌతుంది. పదే పదే చదువుకొనడంవల్ల క్లిష్టమైన విషయాలు సైతం బోధపడతాయి. అట్టి అవకాశం కలిగించేది పద్యం. ఆదృష్టిలో పద్యానికి ప్రత్యేక స్థానముంది. ఈ రచన కదే కారణం.

ఇందులో చాల చిత్రాల బ్లాకుల నుపయోగించడానికి అనుమతించి, బ్లాకులను దయతో పంపిన చి॥ ఎ. ఎ. ఎస్. రామారావుకి నా ధన్యవాదాలు.

విజయనగరం
15—4—1957.

వ. వెంకటరావు

# విషయ సూచిక



# గాలి

1

నీటిసంద్రమందు నివసించు చేపనా
గాలిసంద్రమందు గ్రాలు మనిషి,
చేప నీరులేక జీవింప లేనట్లు
మనిషి గాలిలేక మనుట సున్న.

2

నీటిలోనదేలు మేటి తిమింగలా
లైన మనిషి గాలిలోన మునుగు,
మునిగి యున్న మనిషి మున్కలు వేయకే
చేయు జీవయాత్ర హాయిగాను.

3

వసుధ నావరించి వందల మైళ్లు పై
కెగసి, మేఘ మిసుక పొగలు ధూళి
దాటిముక్కలున్న వాతావరణమన్న
గాలిపొరయె రక్షకాగ మనకు.

4

అమరున్ వాయుమహాసముద్ర తలమం
దత్యంత శోభాయమా
నముగా మంజుల పుష్పసంభరిత నా
నానేక వృక్షంబు, లా
దిమ కాంతారము, లున్నతోగ్ర గిరు, లు
త్సేకించు స్రోతస్వినుల్,
రమణీయంబగు సౌధరాజములు, హ
ర్మ్యంబుల్ నభంబంటుచున్.

5

గాలి నైదుపాళ్లు కావింప నందులో
నాల్గు పాళ్లవరకు నత్రజనియు,
ప్రాణ వాయువొక్క పాలును మిగిలిన
వన్ని వాయువుల్ రవంత గలవు.

6

ఎండు కర్రలైన మండపు గాలిలో
వండి ప్రాణవాయు వుండకున్న,
బొగ్గుపులుసు వాయు వగ్గలంబైనచో
ముప్పు కలుగు జీవములకు నెల్ల.

7

మనిషి నెత్తిమీద మర్దించు చున్నట్టి
గాలి బరువు తూచ కలిగినారు,
బింకమైన నిండు బియ్యపు బస్తాకు
సాటివచ్చు దాని మేటి బలము.

8

పైకిపోవు కొలది వాయువు పలచనై
యూపిరాడనీయ కుండునంట;
అది విమాన యాన మందెంత కష్టమో
తెలిసికొనుట చాల సులభమంట!

9

మూడుమైళ్లు పైకి పోయినచో నీరు
గడ్డకట్టు చల్లగాలి వీచు,
పైకి పోవుకొలది వడి వడి చల్లనౌ
పాదరసము గడ్డవారు వరకు.

10

స్పంద జనిత శబ్దజాలమంతయు వాయు
యానకము[1]న దెసలు వ్యాప్త మౌను,
వాయు యానకమ్మె మాయమై నప్పుడు
శబ్ద మాలకింప జాల మింక.

## 11

సౌర శక్తియందు శక్తిమంతములైన
కిరణములును, విశ్వ కిరణములును[2],
అదిమిపట్టి గాలి యణువుల మర్దించి
పగులగొట్టు చుండు ప్రతి క్షణమ్ము.

## 12

ఛిన్నమైన యణువు లన్నియు అయను[1]లై
ఆకసమును విద్యు దీకరించు,
అవని చుట్టునున్న అయనావరణములే
రేడియోలు వినగ తోడుపడగ.

## 13

కేంద్రయంత్రముల్ వికేంద్రీకరించెడి
అలలు అయన గోళములను తాకి,
మరలి, భూమివైపు మరల ప్రయాణించి,
రేడియోల పలుకరించి, పలుకు.

## 14

సూర్య గోళమందు సుడిగాలివలె లేచు
మంట లవనిచేర మధ్యనున్న
అయను పొరలు చెదరు, అందుచే రేడియో
లొక్కసారి పలుక కూరకుండు.




చిత్రము - 1

గాలిలో పొరలు, అయనావరణ ముండుటచేతనే రేడియో తరంగాలు సూటిగా ఆకాశములో పోక వెనుతిరిగి, లోకమంతట రేడియో వినడానికవకాశం కలుగుతూంది.

## 15

బ్రహ్మ దయస్స్వాంత మీభూమి, అహరహమ్ము
ధ్రువ సమీపాన అయన సందోహముండు,
అందు విద్యుత్తు స్రవియించు నపుడు బహుళ
వర్ణములతో అరోరాలు[4] వ్యాప్తమౌను.

## 16

ఆకాశ వీధులంబడి
యేకాంతముగా చరించు ఏ శకలంబో
ఆకర్షితమై వడి భూ
లోకంబున జొచ్చి ఉల్క[5] రూపు ధరించున్.

## 17

అమిత గ్రహాంతరాళమున
వ్యర్థముగా పయనించు ద్రవ్య లే
శములగు ఉల్క లత్యధిక
సార్వజనీన గురుత్వ శక్తి బం
ధములకు జిక్కి గాలిపొర
దాటుచు భూమిని చేరుచుండ వే
గమునకు గాలి రాపిడికి
గాసిలి మండి నశించు త్రోవలో

## 18

ప్రతి దినమ్ము వేల వందల ఉల్కలు
భూమి జొచ్చి మండిపోవు చుండు,
క్షేమ మరయుగాలి శ్రీరామ రక్షగా
కాచుచున్న దివ్య కవచ మనగ.

## 19

గాలినున్న నీటి కణములలో నుండి
వచ్చు సూర్య రశ్మి వంగినపుడు,
వివిధ వర్ణకిరణ విక్షేపణముచేత
ఇంద్ర చాపమొగి రచించు నింగి.

## 20

సూర్యరశ్మినుండి చురచురమను అతి
నీలలోహిత కిరణాల[6] మ్రింగి,
జీవకోటి కెట్టి చెడుగు రానీయకే
కాచు చుండు మీది గాలిపొరలు.

## 21

గాలి యణువులపై బడ్డ కాంతిలోని
అల పొడవు తక్కువైనట్టి అలలనెల్ల
మిగుల చిందుటచేనవి పగటి పూట
నభమునన్ స్వచ్ఛనీల వర్ణమ్ము దోచు.

**22**

గాలి జొచ్చినట్టి ఖరకరు కిరణమ్ము
లేటవాలుగా గమించు నపుడు
కోడిగుడ్డువోలె గోచరించును కదా
సౌరబింబ ముభయ సంధ్యలందు.




చిత్రము 2

## 23

గాలి హొరటాటి పైకేగగా నభమ్ము
నల్లబడి భీతి కలిగించు నెల్లరకును,
తారకలు దుర్నిరీక్ష్యమౌ, తత్కరములు
ఖర శిలీముఖలవలె కనులపొడుచు.

## 24

క్రోధావరణంబునన్ నా
కోపముతో తీవ్ర వాయుడొంససమున మే
ఘ పరికరము తలక్రిందై
కమ్మగ వర్షించు రైతుకృషి ఫలియింపన్.

## 25

అయనా వరణము నంగల
వాయువు విరళంబుగాన బహుళాంబుధి సం
చయములందు నుండ నేరవు;
అయనావరణమ్ము శూన్య మనుట నిజంబే!

## 26

విద్యుదావేశ పూరిత వివిధమేఘ
మాలికలు వేగరాపాడు కాలమందు
పరుషము మెరపు జనించు: విద్యుత్ స్రవించి
ఘోష ఘోరార్భటితో పడు పిడుగసంగ.

## 27

అణువులు రవికాంతి నయనులై జలబాష్ప
  మునకెల్ల కేంద్రికములుగ దనరు,
బాష్పము బిందు రూపముదాల్చి మేఘమై
  ఆకాశమున నడయాడు చుండు,
మేఘము చల్లారి లాఘవత్వము వీడి
  వర్షమై వడిగ భూపతనమొందు,
వర్షధారా జలప్లావిత భూతల
  మతుల సస్య సమృద్ధమై యెసంగు,
పండ్లు కాయలు సస్యముల్ పచనమైన
మంచి యాహారమును తిని మనిషి బ్రతుకు
గాలిలేకున్న లేక వర్షాలు, పంట
లేక జీవాభివృద్ధియే లేకపోవు.

---

1 మీడియం
2 కాస్మిక్ రేస్
3 అయాన్స్
4 అరోరా బోరియాలిస్
5 మీటియర్
6 అల్ట్రావయొలెట్
7 ట్రోపోస్ఫియర్
8 అయనోస్ఫియర్

# గ్రహాలు

---

1

కారు చీకట్లు దిక్కుల గ్రమ్ము కొనగ
వెలుగు చుక్కల వలె నభో వీధి మెరయు
తార లుజ్జ్వల తీవ్ర దందహ్యమాన
ద్రవ్య గోళము లందు మార్తాండు డొకడు.

2

ప్రక్క ప్రక్కల నున్న తారకల దూర
మరయ అసువైన కాంతి వత్సరము[9] తోడ
కొలుతు, రరువది లక్షల కోట్ల మైళ్లు
దాని పరిమాణ మూహ కందదు రవంత.

3

ఆకాశ మహార్ణవమున
నేకాకిగ దోచు చుండు నే తారకయేన్
నౌక వలె సాగి పోవుచు
చీకటిలో జీవ యాత్ర చేయుచు నుండున్.

4

కూతవేటు దూర మేతెంచె నొక తార
రవికి కోట్ల వత్సరముల క్రితము,
ద్రవ్య బలము చేత ద్రవ్య తరంగాలు
గుబురు కొనియె సూర్య గోళ మందు.

5

ఆకర్షణా బల జనితం
బాకాశము నంటి నట్టి యాద్రవ్యము చు
ట్టాకారముతో విడివడి
పోయెన్ రవి నుండి దూర దూరం బగుచున్.

6

అట్లు విడిన ద్రవ్య మాకాశమున నొక
సూర్యు నాశ్రయించి చుట్టు తిరుగ
మొదలు పెట్టి, తుదకు పది పెద్ద ముక్కలున్
లెక్క లేని చిన్న ముక్క లయ్యె.

7

మండు చున్న వాయు ఖండాలుగా పుట్టి
ఆరనమ్ము వేడి నపహరింప,
గడ్డ కట్టి నట్టి గ్రహములు బంతులై
నిరత మినుని చుట్టు తిరుగు చుండు.




చిత్రము 3

సూర్యుని నుండి గ్రహాల దూరము. దగ్గరగా నున్నవి బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు.



చిత్రము 4

సూర్యునికి దూరముగానున్న గ్రహాలు : గురుడు, శని, యురేనసు, నెప్ట్యూను, ప్లూటో.

8

గురు కుజుల మధ్య నుండిన
బరువగు గ్రహ మొకటి గురుని బల బంధమునం
దిరుకు కొని తునక లవగా
కరవై యా గ్రిహము త చ్ఛకలములు[10] మిగిలెన్.

9

దినకరుని దీప్తి వ్యాపించి దిక్కులెల్ల
తగ్గును విలోమ వర్గ సూత్రి[11]ను సార,
మందుచే కొంత దూరాన నాకసమున
నుండు నొక సమ శీతోష్ణ మండలంబు.

10

అందు తిరుగు భూమి కనువైన తేజోష్ణ
మమరు చుంట నిత్య మమర లోక
తుల్య మైన ప్రికృతి తో విరాజిల్లగా
జీవ రాశి వృద్ధి చెందు నచట.

11

భూలోకంబున జీవము
కాలానుగతిం జనించి క్రమముగ పెరిగెన్,
భూలోక జీవ రాశు లి
కే లోకము నందు గోచ రింపవు కాదే!

## 12

మన మెరిగి నంత వరకును
వని పించదు జీవ మితర గ్రహముల నెచటన్,
కను మూసె నేని యంతిమ
మనుజుడు వాపోవు సౌర మండల మెల్లన్.

## 13

క్షోణి కిటునటు గల శుక్ర కుజుల యందు
మజుడు చల్లారి జీవాను కూల మయ్యె
భూమికిన్ పూర్వ, మందుచే పుట్టి యుండ
వచ్చు నటు జీవ మెన్నడో వసుధ వోలె.

## 14

జీవన స్పర్థ[12] ప్రత్యేక జీవ లక్ష
ణముగ విజ్ఞాని గ్రహియించి నాడు; జగతి
జీవ మొకసారి పుట్టినా చేవ దేరి
ప్రతిఘటించును ప్రకృతి విపర్యయముల.

## 15

మున్ను కుజుని యందు పుట్టిన జీవులు
బుద్ధి కౌశలమున వృద్ధి నొంది,
సకల కళల యందు సర్వ శాస్త్రము లందు
మిన్ను ముట్టగా గమించి రేమో !

గాలి, గ్రహాలు

సన్నము గాగ గట్టిపడి
సాగర పర్వత వృక్ష జంతు సం
పన్నముగా వసుంధర న
ఖండము నిత్య మలంక రించెడున్.

## 22

ప్రకృతి శక్తుల తొల్యము పాడు చేసి,
ఋతువులన్ ధ్వంస మొనరించి కృతక శక్తి
నమితము సృష్టి జేసి, జీ వానుకూల
మైన భూమిని మరుభూమిగా నొనర్చి.

## 23

ఏమి సాధింప నున్నాడో ఈ యభాగ్య
మానవుడు సర్వ నాశన మైన పిదప ?
ఏమి లక్షించునో స్వయంకృషి ఫలముగ
భూమి జాజ్వల్యముగ మండి పోవు నపుడు

## 24

ఏక కణముగ తొలుత జనించి జీవ
మెట్టి పరిణామ మొందెనో యెరుగ రాదు;
మానవుం డెట్టి నూతన మార్గ మరసి
యాత్ర సాగించునో జైత్రి యాత్ర కాగ !



పటము 1

శుక్రుని కళలు

## 25

గురుడు గ్రహము లందు గురువౌట గ్రహరాజు,
గురుని బల మనంగ గురుతరమ్ము,
పసుల గొట్టి గురుని పదమూడు వందల
వసుధ లౌను, ఎంత వాడో గురుడు ?

## 26

శని చుట్టు తిరుగు చుండిన
గణనాతీతమగు ద్రవ్య కణ సంచయమే
కనిపించు వలయములుగా,
శని దొరటోపీ ధరించు చందము దోపన్.

## 27

తనలో తను తిరుగుట కొక
దిన మగునట గ్రహము పట్ల, దినకరు చుట్టున్
తను తిరుగుట కొక వత్సర
మని బుధ నిర్ణయము జరిగి నప్పటి నుండిన్.

## 28

మన దిన మరువది ఘడియలు,
మన నెల ముప్పది దినాలు, మన వత్సర మం
దున ద్వాదశ మాసము లని
మనకున్ కాల పరిమాణ మానము లొదవెన్.

**29**

సోమ పరిభ్రమణంబున
భూమి నమావాస్య, నిండు పున్నము, నెల, ప
క్షములును, రవి చంద్ర గ్రహ
ణములును వాటిల్లు చుండు నైజ ప్రగతిన్.



చిత్రము 6
చంద్ర గ్రహణము




చిత్రము 7
గ్రహణములు

## 30

బుధుని దినము మనకు మూడు మాసము లౌను,
బుధుని యేడు కూడ మూడు నెలలు;
ఏటి కొక్క రోజు యేర్పాటు బుధునిలో
నూరు రోజులైన వారు మనరు.

## 31

గురు లోకంబున వత్సర
పరిమాణము ద్వాదశాబ్ద పరిమితి నందన్,
గురు దినము మాత్రమే పది
హోరలకో మించి యుండ దందురు నిజమే!

## 32

మన ముప్పది వత్సరములు
శనిలో నొక వత్సరమ్ము, శని దిన మనగా
మన పది గంటల ప్రాయము,
శని యేటికి రోజు లెన్ని శతములు గలవో?

## 33

గ్రహము లన్నిటిలో ఒకే కాలమాన
మనుకొనుట తప్పుగా స్పష్ట మయ్యె నిపుడు:
చంద్రలోకాన దినము మాసమును సమము,
వత్సరానికి దినములు పదియు రెండు;

## 34

శుక్ర బుధుల కొక్క సోముడైనను లేడు,
భూమి కొక్క చందమామ గలదు;
కుజుని కెన్న రెండు, గురునికి పదకొండు,
శనికి పదియు గలవు చంద్రు లరయ.

## 35

శని గురుల కున్న చంద్రుల సంఖ్య చేత
వివిధ మాసాలు వాటిలో వెలయ వచ్చు,
వేయి రేయియు విధిగ చంద్రికలు విరియ
చీకటే లేని నిశలట చెలగ వచ్చు.

---

9 లైట్ ఇయర్
10 ఏస్టరాయిడ్స్
11 ఇన్వర్స్-స్క్వేర్ లా
12 స్ట్రగల్ ఫర్ ఎక్సిస్టెన్స్

# చంద్రుడు

1

తమము నశింప జేసి నిర
 తమ్ము కరమ్ము లొసంగు భానుడున్,
తమ మణగించు కాంతు లిడు
 తారకలున్ ప్రభవించి వెల్గు చం
ద్రమున జనించి, నీవు గగ
 నమ్మున గ్రాలుచు మానవాళి సం
భ్రమ నుతు లొంద వో శశీ! క
 రమ్ము విచిత్రము నీ చరిత్రముల్.

2

స్థిరుడవు కాక పోయిన శ
 శీ! వికృతిం బొడ జూపు నీదు సం
చరణము సర్వదా గణిత
 శాస్త్ర నిబంధన నొప్పియుంత, సు

స్థిరమగు నస్థిరత్వ మన
　　జెల్లును కాన్కి యాథార్థ మైన నీ
చరిత మెఱుం గతిక్రమ వి
　　చార మొనర్చుట హేయమా కదా!

3

దినకరు దీప్తి జాలము న
　　భీనము నుండి తొలంగి సంచరిం
చిన వసుధార్ధ మందు నివ
　　సించు జనాళి నిశా భయమ్ముచే
ననయము తల్లడిల్ల కమ
　　లాప్త కరప్రకరాంశ మూని త
జ్జన పరితాప మార్పవె శ
　　శాంక! నభః పరివర్తనుండవై.

4

ఖరకరు కాంతులం గొనియు
　　క్రౌర మడంచు దయామయుండ వ
ద్దిర కుముదాప్త! నీ విపుల
　　దీధితి జాల విశిష్ట శీత లాం

తర నిహితైక సౌఖ్య మతి
   తాప గుణోద్భవ హేతు వంచు నిన్
విరహులు దూరు మాత్రమున
   వెఱ్ఱి జనించునె నీ ప్రశస్తికిన్ ?

**5**

"మరును వహించి కాములు
   దూలగ చల్లగ నేచి నీ వెదన్
బోరిబోరి పొంగ బోకు, పరి
   పూర్ణ కళా పరిశోభి తుండవై
విరిసిన రేయి నీ వికృత
   పీడనముల్ ప్రతి ఘాత మొంద దు
ష్కరముగ రాహు కేతుల ము
   ఖంబున జిక్కి కృశింప కుందువే !

**6**

"ఖరకరు కరములు గొని దు
ర్భర యూష్మ మడంచి చలువ పాటించి నిశా
కర ! పాంథ పీడ నార్థము
కురిపింతువు వెన్న లకట, కుటిలాత్ముడవై !

## 7

‘‘పరకాంతా పరిరంభ మొందిన మహా
   పాపంబు, త్వత్సోదరీ
సరసీ జావసథంబు బో నడచు మా
   త్సర్యంబు, శోకార్తు లౌ
విరహోత్కంఠుల నేచు పాతకము నిన్
   వేధించు, ఖండించు వం
కర వోవన్, గళలన్ హరించు తుది ప
   క్షంబందు దోషాకరా!’’

## 8

అని నిను పలు విధముల కవు
లనవరతము దూరు చుందు రన్యాయముగా;
కనరో నిను దుర్భిణిలో?
వినరో శాస్త్రజ్ఞ కథిత విషయము లెపుడున్?

## 9

చిన్న దుర్భిణిలో నైన నిన్ను చూచు
సకియ లెవ్వరు ‘‘చంద్రాక్షి’’, ‘‘చంద్రవదన’’,
‘‘చంద్రముఖి’’ యను వర్ణన నైప బోరు,
మచ్చలును రంధ్రములు స్పష్ట మగుట చేత!

## 10

పెరిగెదవని తరిగెదవని
పరిహాసము చేయు చుంటి పాడియె చంద్రా!
పెరుగుట తరుగుట యెరుగని
స్థిరతర గోళమ్ము నీవు తెలియరు కాదే.




చిత్రము 8

## 11

సూర్య రశ్మి సోక చురచుర మను చుండి
అర్ధ గోళ మొకటి అహరహమ్ము;
కలయ బారి నట్టి కటిక చీకట్లతో
సతము నిండి యుండు సగము దొకటి.

## 12

లేవు మరుత్ సమూహములు,
లేవు ఘనాఘన సంచయంబులున్,
లేవు లతా నికుంజములు,
లేవు రసాల తమాల వాటికల్,
లేవు కదా సముద్రములు,
లేవు నదాది తటాక కూపముల్,
జీవము వృద్ధి చెంద గల
చిహ్నము లెవ్వియు లేవు నీయెడన్.

## 13

త్రాగ నీరు లేదు, రాగి జొన్నల పంట
గింజ లైన లేవు, గంజి లేదు,
కాయ దుంప లైన కమ్మని పండ్లైన
కడుకు ఆకు లైన పంట బడవు.

## 14

గాలి లేనట్టి నీలోక మేల మాకు ?
బ్రదుకుటే దుర్లభంబట, బ్రతుక నేర్చి
నప్పు డైనను మేము మాట్లాడు మాట
లించుకయు విన్పడవు, సౌఖ్య మెట్లు కలుగు ?

## 15

బలవంతుడు తలపెట్టిన
అలసత లేకుండ ముప్పదారడుగులు నీ
తలమున పై కెగురు జుమీ
సులభంబుగ పందె మొడ్డి చుక్కల రాజా !

## 16

రాకెట్లు రాక పోకలు
నీకే లాభించు నయ్యె నిశ్చయముగ, నీ
లోకము బలవన్నవ జీ
వాకరమై పుష్ప ఫల జలావృత మవదే !

## 17

ఇంకొక రహస్య మేమన ఎల్ల వేళ
అర్థ గోళమ్ము నొక్కటే అవని వైపు
త్రిప్పి యుంతువు నీలోన తిరుగు చుండి
ఉర్వికి ప్రదక్షిణాల్ చేయు చుండు నప్పుడు.

## 18

పాల సంద్రమున నుద్భవ మొందినను
  బుద్ధి సలిలము కంటెను పలుచ ననుచు,
సోదరీ వాసంబు చూరగొందు వటంచు
  పాంథుల బాధించు పాపి వనుచు,
గురు కాంతతో గూడి దురి తాపచారమ్ము
  గురున కొనర్చిన కూళ వనుచు,
ద్రోహ మ్మొనర్చుటన్ రాహు కేతుల నోట
  చిక్కి కృశించెడు చెనటి వనుచు,
ఎవరి చిత్తాను సార మీ యవని వారు
నిన్ను దూషింతురే కాని నిశ్చయముగ
నీ వొనర్చెడు మేలు గ్రహింప బోరు,
సుగుణ సంపద నుతిగొంట జగతి నరుదు.

---



పటము ౩

చంద్రుడు



పటము 4

సూర్యుడు

# సూర్యుడు

1

ఎర్ర బింబముగా నుదయించి, పగలు
మెల్ల మెల్లన మింట గమించు చుండ
కరము వేడెక్కి, పశ్చి మాకాశ మందు
గ్రుంకు నపు డెర్ర వారు ఖగోళ రాజు.

2

ఔరా! ఎట్టి మహోగ్ర గోళ మది, ద్ర
    వ్యంబందు వాయు స్థితిన్
హోరాహోరి తపించుచున్ జటుల తీ
    వ్రోదగ్ర రూపంబుతో
ఘోరాకార మరుత్ ప్రకంపములుగా
    ఘూర్ణిల్లుచున్ లేచి, దు
ర్వారాఖిల దురంత వేగమున స
    ర్వ వ్యాప్తమౌ నిచ్చలున్.

### 3

సూది మొన పాటి ద్రవ్యము సూర్యు నుండి
విడివడిన దేని దానికి వేయి మైళ్ల
లోన గల వస్తువుల్ భస్మమై నశించు,
సౌర గర్భోష్ణ మూహింప నేరి తరము !

### 4

బింబోపరితల యుష్ణో
గ్రం[13] బెన్నగ నారు వేలు, క్రమముగ నది కేం
ద్రంబున నాలుగు కోట్ల ప
యింబడి యుండుట విచిత్రమే గద రవిలో !

### 5

సూర్య బింబ మందు చూపట్టు మచ్చలు[14]
భీక రాగ్ని కీల కాకరములు,
ముందు చున్న వాయు మండలా లెగయుచు
కాంతి నడ్డగింప కలుగు నవియు.

### 6

చేడు అణు ఘటముల కూర్పు మారు నపుడు
కలుగు రాసాయనిక శక్తి కాదు, సౌర
ద్రవ్య మొక్కింత రూపాంతరంబు చెంద
ముక్త మౌనట్టి కేంద్రక శక్తి[15] కాని !

7

పర్మాణ్వంతర కిరణముత్త[16]న
ద్రవ్యము పరిణామ మొంది, ద్రవ్యాంతరముం
దవ్యయ శక్తి జనించును
నవ్య పదార్థములతో ననారత రీతిన్.

8

తరగని తాపత్రయమున,
సరిమురి యోచింప నూహ కందని వాతా
వరణముల ప్రేష[17] మందున
ఘరపడు గర్భస్థ తీవ్ర కల్లోలములన్.

9

ద్రవ్య లేశ మొకటి తన వేషమును మార్చి
శక్తి రూపు దాల్చి జవము తోడ
హ్రాస్వతమ తరంగ[18]మై కేంద్రమును విడి
విశ్వ యాత్ర చేయ వెడలు నపుడు.

10

అద్భుత పక్షులం గాని,
దుర్భర సముద్ర మందు దూగాడెడు సం
దర్భమున రెక్క లెడుగన్
గర్భాంతర మంటు దీర్ఘ కాంతి కిరణమా!

# 11

పరమాణు నిర్మాణ మరయు ఛిన్నాభిన్న
 మౌట యెలక్ట్రాను లన్ని చెదరు,
చెదరిన ఖండముల్ చెలగి ఝంఝూవాత
 వేగమ్ముతో పరు వెత్తు చుండు,
పరువెత్తు కణములు బలముగా ఢీకొని
 శక్తి రూపాన విముక్తమ్ములగు,
శక్తి తరంగముల్ జవముతో వ్యాపించి
 ఆకాశ కుహరాల నాక్రమించు,
ఇట్లు రవి గర్భ మందు జనించు శక్తి
భూమిలో నున్న జీవాళి బ్రోచు చుండు,
సౌర శక్తి ప్రమాణమ్ము మారె నేని
లేదు భూమి, జీవము లేదు, లేడు మనిషి!

---

13 సన్ స్పాట్స్
14 టెంపెరేచర్-డిగ్రీస్
15 న్యూక్లియర్ ఎనర్జి
16 ట్రాన్స్‌మ్యుటేషన్ ఆఫ్ మేటర్
17 ప్రెషర్
18 షార్ట్ వేవ్